సీతమ్మ, కోటికలపూడి

సాధురక్షకశతకము

చెన్నపురి, 1903

Record no. 305

# Bibliographic Record Target

సీతమ్మ, కొటికలపూడి.

సాధురక్షకశతకము / ఇది శ్రీమతి కొటికలపూడి సీతమ్మచే రచియింపఁబడినది.- 1. కూర్పు.- చెన్నపురి : చింతామణి ముద్రాక్షరశాల, 1903.

14 p. ;20 cm.

Record no. 305

Sītamma, Koṭikalapūḍi.

Sādhurakṣakaśatakamu / idi Śrīmati Koṭikalapūḍi Sītammacē raciyimpam̐baḍinadi.- 1. kūrpu.- Cennapuri : Cintāmaṇi Mudrākṣaraśāla, 1903.

14 p. ;20 cm.

Record no. 305

శ్రీ

# సాధురక్షకశతకము.

ఇది

శ్రీమతి, కోటికలపూడి - సీతమ్మచే

రచియింపఁబడినది.

మొదటి కూర్పు.

చెన్నపురి:

శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1903.

దీని వెల రూ. 0-2-0.

శ్రీ

# సాధురక్షకశతకము.

ఇది

శ్రీమతి, కొటికలపూడి - సీతమ్మచే

రచియింపఁబడినది.

మొదటి కూర్పు.

చెన్నపురి:

శ్రీ చింతామణి ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1903.

దీని వెల రూ. 0- 2- 0.




# సాధురక్షకశతకము.

ఉ. శ్రీ విలసిల్లఁగా జగముఁ జిత్రముగాఁగ సృజించి పెంచుచున్
జీవదయాపరుం డని సుశీలురచే నుతిగన్నయట్టియో
దేవర నీదుశాసనము దివ్యతరంబుగఁ జెల్లుఁగాక యీ
భూవలయంబులోపలఁ బ్రభూ శరణాగతసాధురక్షకా. ౧

ఉ. హాయిగ నీగుణావళి నహర్నిశమున్ దలపోసి లోన నా
ప్యాయము నొందఁ గోరి యిటు లల్లితిఁ బద్యశతంబు దీని లోఁ
బాయని ప్రేమతోడ నొకపచ్చలహారముగాఁగఁ గొంచు నన్
వేయివిధాలఁ బ్రోవఁ గదవే శరణాగతసాధురక్షకా. ౨

ఉ. పిల్లలు పల్కుపల్కులను బ్రీతిని బ్రాజ్ఞులు తప్పుపట్టన
ట్లెల్లెడ నున్నతప్పులను నేవను జూడక పండితోత్తముల్
చల్లనిచూపుతోడ నిది చక్కఁగ దిద్ది క్షమింతు రంచు నా
యుల్లములోన నమ్మితి నహో శరణాగతసాధురక్షకా. ౩

ఉ. చక్కనికావ్యకన్యకను జాల నలంకృతి చేయ లేమిచే
నెక్కువితాలాతాంగిఁ గని యెల్లకవీశ్వరు లెంతయేనియున్
బక్కున నవ్వి పోదు రనుపాయనిభీతిని బొంది యుండియున్
జిక్కితిఁ జాపలంబునను శ్రీశరణాగత. ౪

ఉ. భావములోన నిన్నెపుడు భక్తిని గొల్చుచు నుండునట్టినీ
సేవకు లార్తి నొంది మము శీఘ్రమె ప్రోవు మటంచు వేడ సం
భావనతోడ వారల నపారకృపామతిఁ బ్రోచునట్టినీ
వే వెర వంచు నమ్మితి మహిన్ శరణాగత. ౫

ఉ. భూమిని గల్గుమానవు లపూర్వము లైనటువంటి కార్యముల్
వేమఱుఁ జేసి చూపుచు వివేకము గల్గి చరింపఁ గల్గుటల్
స్వామి భవత్కృపామహిమ బాగుగఁ దెల్పెడుఁ గాన సర్వదా
యీమహి నిన్నె నమ్మితిఁ గదే శరణాగత. ౬

ఉ. వింతగఁ దోఁచు నెంతయు నభీష్టఫలప్రద నీసుసృష్టి యా
వంతయు మార్పు నొందక యనంతసుఖావహమై జనాళి కే
వంతయుఁ గల్గ నీక నిరపాయకరంబుగ నుంటఁ జూడఁగా
నెంతటిదాన నిన్బొగడ నే శరణాగత. ౭.

ఉ. బాపురె పాపజాలములపాల్పడి కష్టపడంగ నోప నీ
దాపునఁ జేర్చికొమ్మని సదా నిను భక్తిని గొల్చునన్ను నే
యాపద నంట నీక హృదంతరమందు వసింపుమయ్య యో
పాపహరుండ వేగమె కృపన్ శరణాగత. ౮.

ఉ. చాలఁగ నెల్లవేళల నశాశ్వతసౌఖ్యము లాస చేసి నేఁ
గాలము వ్యర్థపుచ్చితిని గా యిఁక నైనఁ బరంబుఁ గోరి స
చ్ఛీలతఁ బ్రొద్దు పుచ్చి నిను శీఘ్రమె చేరువిధంబుఁ జూపుమా
చాలఁ గృపారసంబిడి వెసన్ శరణాగత. ౯.

ఉ. అయ్యయొ లోకసౌఖ్యముల నన్నిటి నాదటఁ గోరి వాని నే
నెయ్యెడఁ బాసి యుండుట సహింపక నిన్నుఁ దలంపకుంటి నో
యయ్య యశాశ్వతంబు లగునట్టిసుఖంబుల గాసిఁ జెందు నా
కియ్యవె జ్ఞానదాన మిడవే శరణాగత. ౧౦.

ఉ. దేవర నే సువిద్యలను దేటి పవిత్రత నొంది వేగమే
యేవిధి నైన సత్క్రియల నెంతయు భక్తిని నాచరించి నీ
సేవకురాల నై నిను సుశీలతఁ జేరి శుభంబు నొందున
ట్లీ వీక నన్నొనర్పఁ గదవే శరణాగత. ౧౧.

ఉ. తల్లియుఁ దండ్రియు న్గురువు దైవము సర్వము నీవె యంచు నా
యుల్లములోన నమ్మితిని నో పరమేశ్వర భక్తవత్సలా
కల్లలు గావు నానుడులు గాదన కెంతయు నాదరింపుమీ
చల్లనిచూపుతో నను వెసన్ శరణాగత. ౧౨.

ఉ. భూమిని గల్గుసర్వము నభోమణియున్ శశితారకాదులున్
స్వామి భవద్గుణామృతము బాగుగఁ ద్రావఁగ నిచ్చు నాకు నిం
కేమి కొఱంత నిన్నె మది నెప్పుడు నమ్మి భజింతు నయ్యయో
ధీమహితా కృపాజలనిధీ శరణాగత. ౧౩.

ఉ. ఎల్లెడ నిండి యుండి పరికింపఁగ రూపము లేక సర్వదా
చల్లనిదృష్టితో సుజనసంతతి వర్ధిలఁ జేయు దీవు ని



న్నెల్లపుడు న్దలంతు మది నెంతయుఁ బాయనిభక్తితోడ నా
యుల్లము శుద్ధి చేయఁ గదయో శరణాగత. ౧౪.

ఉ. భూతదయార్ద్రభావమును భూరివివేకము ధర్మచింతయున్
నీతియు సత్యసంధతయు నిత్యము నామదిఁ బాయకుండ సం
ప్రీతి నొనర్చి కావవె పవిత్రుఁడ వైనమహానుభావ నా
నేత వటంచు నమ్మితిని నే శరణాగత. ౧౫.

ఉ. ఓపరమేశ! యోవరద! యోసుగుణాకర! దీనరక్షకా!
పాపి నటంచు నాయెడ నపారపుఁగిన్క వహింపకుండ నీ
దాపునఁ జేర్చికొందు వని తప్పక నామదిలోన నమ్మితిన్
బ్రాపయి నిల్చి కావవె కృపన్ శరణాగత. ౧౬.

ఉ. స్వామి మదీయమానస మసారపుసౌఖ్యములందుఁ జిక్కి నా
కేమికొఱంత భోగము లనేకము గల్గె సుఖింతు నంచు ముం
దేమయి పోదునో యనుచు నించుక యెంచదు తెల్వి లేమిచే
నోమహనీయ జ్ఞాన మిడుమో శరణాగత. ౧౭.

ఉ. కాయ మశాశ్వతం బనుచు గట్టిగ నమ్మి నినుం భజించి యా
ప్యాయన మొందఁ గల్గెడునుపాయము దెల్పు మటంచు నిన్ను నే
వేయివిధాల వేఁడితిని వేగమె నామొఱ నాలకింపుమీ
ధీయుతమూర్తి సద్గుణనిధీ శరణాగత. ౧౮.

ఉ. ఏల మహాత్మ జాల మిటు లీగతి గానని దీనురాలిపై
జాలి యొకింత గల్గి నను సాదరలీలను బ్రోచుచుం గృపా
లోల మదీయమానసములోన వివేకము గల్గఁ జేయుమీ
చాలఁగఁ గొల్తుఁ బుణ్యపురుషా శరణాగత. ౧౯.

ఉ. కావవె నన్ను నోపరమకారుణికోత్తమ నిన్నె నమ్మితిన్
గేవల మాత్తరూపి వగుకీర్తివిభూషణ నిజభక్తులన్
బావనచిత్తులై వెలయ బాగుగ దిద్దుదు వంచు నిన్ను స
ద్భావము చేసి కొల్తును సదా శరణాగత. ౨౦.

ఉ. చాల వివేకవంతు లగుసజ్జను లెల్లరు భూరిసద్గుణా
వాలుఁడ వైనని న్నెపుడు భక్తిని గొల్చుచు సత్యమార్గముం
బోలిని సంచరించుటయె యొప్పగుమానుషధర్మ మందు రో
పాలితభక్త కావవె కృపన్ శరణాగత. ౨౧.

ఉ. పావన మైనసత్యమును బాయక నీకు నపారభక్తితో
సేవ యొనర్చుచు న్సకలజీవులఁ బ్రీతిని జూచు చెప్పఁడన్
దేవగుణంబు లెల్లను మదిన్ గలిగించుకొనంగఁ జేయుచున్
గావవె నన్ను సత్కృప నికన్ శరణాగత. ౨౨.

ఉ. నేను నవజ్ఞతన్ మునిఁగి నిర్మల మైనభవత్స్వరూపమున్
ధ్యానము చేయ నేరక సదా స్థిరసౌఖ్య మెఱుంగ కుండి సు
జ్ఞాన మొసంగవే యని ఘనంబుగ వేడితిఁ గాన నన్ను స
న్మానముతోడ నేలుకొనుమా శరణాగత సాధురక్షకా. ౨౩.

ఉ. పుట్టిన దాది వ్యాధులకుఁ బుట్టినయిల్లని చెప్ప నొప్పి నే
డిట్టితనంబు దూలి భవదీయవిచిత్రచరిత్ర నామదిన్
బట్టు పడంగఁ జేయఁ గలబాటను బోవఁగఁ జాల నైతి న
న్నెట్టు తరింపఁ జేసెదొ గదే శరణాగత. ౨౪.

ఉ. అయ్యయొ నీకుటుంబ మగునందఱ నేకసమానదృష్టితో
నెయ్యెడఁ జూచి సఖ్య మొనయింపుచు నిన్ను భజించు చెప్పఁడున్
జయ్యన వృద్ధి నొందుటకుఁ జాలినబుద్ధి కొఱంత గల్గునా
కెయ్యెడ దిక్కు నీవె కదవే శరణాగత. ౨౫.

ఉ. ఎన్నిమతంబు లారసిన నెయ్యది చూచిన నెందు విన్న నీ
కన్న మఱొక్కకారణము కానఁగ రా దిల సృష్టి, కద్భుతం
బెన్నఁడు నీస్వరూప మది యెట్టిదొ చూడనియట్టిమాకు నీ
వన్నిటఁ దోఁచుచుందు వహహా శరణాగత. ౨౬.

ఉ. నీదయఁ దెల్పు వృక్షములు నిన్ను నెఱుంగఁగఁ జాటుఁ దారకల్
మోదముఁ గూర్చు వాహినులు భూరి వివేకముఁ దెల్పు సర్వమున్
వేదముఁ బోలె సృష్టిని వివేకనిధీ సృజియించి మాకు జ్ఞా
నోదయకారి వైతి విటు లోశరణాగత. ౨౭.

ఉ. చల్లనిగాలి చూచినను జక్కనిపువ్వులతీరు చూచినన్
గొల్లగఁ గాయుపండ్లు గనుఁగొన్నను దియ్యనినీరు చూచినన్
సల్లలితప్రభావ గుణసాగర దేవ భవద్విలాసముల్
తెల్లముగాఁగఁ దోఁచెడి మదిన్ శరణాగత. ౨౮.

ఉ. బాలలు చూచి యాడుకొన వన్నెలపాదరసంపుబుడ్లనున్
బ్రేల్లగఁ గట్టుతల్లిగతిఁ బ్రేమను జక్కనితారకావళిన్



జాలఁగ నంబరంబున నిశాసమయంబునఁ జూపి మాకు నీ
లీలలు చాటుచుందువు బళీ శరణాగత. ౨౯.

ఉ. సృష్టిని నెందుఁ జూచిన విశేషమహత్త్వము గల్గువస్తువుల్
కష్టము గల్గ నీయక సుఖం బొనఁగూర్చెనె మానవాళి కో
స్రష్ట దయార్ద్రభావమునఁ జాల నమర్చితి వీ వటంచు నా
దృష్టికిఁ గానవచ్చెడుఁ గదే శరణాగత. ౩౦.

ఉ. ఇట్టిభవద్విలాసముల నించుక యైన గ్రహింప లేక నే
నిట్టుల మైనమూఢత వినిర్మలభావము నొంద నైతి న
న్నెట్టయినం దయం గనఁ గదే కరుణాకర దీనపోష నీ
పట్టిని గానె నేను దలఁపన్ శరణాగత. ౩౧.

ఉ. కోపము మెండు నా కెపుడు కుచ్ఛితబుద్ధి యఖండవృత్తితోఁ
గాపుర ముండు నామదిని గల్మష మింక నశింప దయ్యె నా
పాపపుఁజిత్తవృత్తులను భస్మము చేయఁ గదయ్య వేగ సం
తాపహరుండ భక్తవరదా శరణాగత. ౩౨.

ఉ. క్రోధుఁడు లోభుఁడుం గలిసి క్రూరత నేర్పెదు రయ్య నాకు సం
శోధన చేసి మోహుఁడు విశుద్ధతఁ దాను హరింపఁ జూచు నే
సాధనశక్తి నైనను విచారణ చేయుమ వీనిఁ ద్రుంప స
ద్బోధ యొసంగి కావవె ప్రభూ శరణాగత. ౩౩.

ఉ. తక్కిన మత్సరాదు లగుతస్కరు లెల్లరుఁ గూడి తాము పే
రెక్కినజ్ఞానరత్నము హరింపఁగఁ జూచెద రయ్య యింక నే
నక్కట యేమి చేయుదును హంతకు లైనటువంటివీరి నే
గ్రక్కున నొంప సాయపడ రా శరణాగత. ౩౪.

ఉ. నీకరుణాకటాక్ష మను నిర్మల మైనధనుస్సుఁ బూని నే
భీకరవైరివర్గముల బిట్టలుకం దెగటార్చి నేర్పుతోఁ
జీకటిఁ బోలునజ్ఞతను ఛీ యని రోసి భవత్పదాబ్జముల్
వీకఁ గనంగఁ జేయఁ గదవే శరణాగత. ౩౫.

ఉ. ఈగతి ధైర్యవృత్తిని నహీనతఁ బొందుచు నైహికంబు లౌ
భోగము లెన్ని యుండినను బొంగక యవ్వలఁ గ్రుంగ కెప్పుడున్
వేగమె యాత్మతత్త్వము వివేకముతోడ గ్రహింపఁ జేసి సన్
బాగుపడంగఁ జేయవె కృపన్ శరణాగత.

ఉ. నీదయ కల్గెనేని యిటు నేర్పున శత్రుల నుక్కడంచి వే
ల్పీవల సాకులన్ మిగులఁ బ్రీతిని జూచుచు నాత్మయందు స
న్మానము గల్గి యుండు నిఁక మోక్షసుఖప్రద మొండుకోర్కె నా
కేదియు లేదు నిక్కము సుమీ శరణాగత. ౩౭.

ఉ. నీవొకరుండు దక్క భువి నెయ్యమునం గనువార లెవ్వర
య్యా విమలాత్మ భక్తులహృదంతరమందు వసించి వారిదు
ర్భావము లన్ని ద్రుంచుచుఁ దిరం బగుబుద్ధి నొసంగువాఁడ వం
చే విని నిన్ను నమ్మితి మహీశ శరణాగత. ౩౮.

ఉ. భక్తులపాలిభాగ్య మని ప్రస్తుతి చేయుచు నిన్ను సజ్జనుల్
భుక్తియు ముక్తి యిచ్చి దయఁ బ్రోచి కృతార్థత నొందఁ జేయుచీ
శక్తుల నాత్మయందె కని చాలఁ బ్రమోదము నొందిరయ్య నీ
రక్తి నిఁ కేమి చెప్పుదు దొరా శరణాగత. ౩౯.

ఉ. భూమిని నాకసంబునను బ్రహ్మఁడ వైకన రూపు లేకయే
సామి యొకండు లోకములఁ జక్కఁగఁ బ్రోచుచు నుండువాఁ డటం
చీమహి నెల్లరుం దెలియ హృత్ఫలకంబుల వ్రాసినాఁడ వా
హా మహిమాన్వితా నిరుపమా శరణాగత. ౪౦.

ఉ. ధీర! పరాత్పరా! గుణనిధీ! జగదీశ్వర! నీవు లేక యీ
ధారుణి నొక్క టుండునె సదా భవదాజ్ఞయె కాక యెల్లెడన్
గూరిమిఁ బైని లోపలను గూడ వసించితి వాత్మరూపివై
యారసి నిను స్మృతింతు వరదా శరణాగత. ౪౧.

ఉ. ఎంతో తపంబు చేసినను నెట్టి మహాత్ములఁ జేరి కొల్చినన్
వింతలఁ దెల్పుగ్రంథముల వేలకొలంది పఠించి యుండినన్
సుంతయు నిన్నెఱుంగరు విశుద్ధచరిత్రులు కానివారు, నీ
వెంతటివ్యాపకమూర్తివో కదే శరణాగత. ౪౨.

ఉ. పూవునఁ దావి యుండుగతి భూస్థలి [illegible]ట నిండి యుండఁదానీ
భావ మెఱుంగ లేరు మదిఁ బాప[illegible]కము గల్గువార లో
పావనమూర్తి, యంధులు ప్రభాకరు తేజముఁ గాంచ నేర్తురే
భూవలయంబులోపలఁ బ్రభూ! శరణాగత. ౪౩.

ఉ. అరయ నల్పబుద్ధు లగునట్టిమనుష్యులు నిన్నెఱుంగఁ గా
నేర రటంచు నెంచి మది నిర్మలరూపు నంత రాత్మునిన్



గూరిమి వారిలోపలను గోప్యతరంబుగ నుంచినావు వహో
ధీర! మహేశ్వరా! గుణనిధీ! శరణాగత. ౪౪.

ఉ. మానవధర్మముల్ దెలిసి మాన్యత నొందువిధంబు లెన్నియో
కానఁగ వచ్చుచుండినను గానక యజ్ఞత సంచరించి నే
జ్ఞానవిహీన నైతి నిఁక సద్గతి నొందఁగఁ జేయు మయ్య నీ
దాన నటంచు వేఁడెద సదా శరణాగత. ౪౫.

ఉ. మానవజాతి నంతను సమానదయం గనుఁగొంచు భేద మిం
తైనను లేకయే సమత నారసి సఖ్యము తప్ప కుండు టే
జ్ఞాన మటన్న పల్కులను జ్ఞప్తిని నిల్పుకొనంగఁ జేసి నా
కానిపనుల్ దొలంపవె యికన్ శరణాగత. ౪౬.

ఉ. ఈమహిఁ గల్గువంతల సహించుచు నెంతయు ధీరవృత్తితోఁ
గామితసిద్ధి నొందఁ దగుకాలము సద్వినియోగ పుచ్చునన్
నేమము గల్గి యుండునటు చేయుము నన్ను దయాంతరంగ పా
పామరతన్ దొలంచుము కృష్ణ శరణాగత. ౪౭.

ఉ. లోకములోనిబంధువులలో నినుఁ బోలినబంధు వుండునే?
ఓకరుణాసముద్ర! నిను నొక్కని నమ్మినయప్డు సజ్జనా
నీకము బంధులోక మగు నిన్ను భజించుచు నుండువార లే
పోకలఁ బోక యుందురు ప్రభూ! శరణాగత. ౪౮.

ఉ. నీపయి భక్తి గల్గి కడు నీచగుణంబుల కాలవాలమై
యేపున నుండుకోపమున కెన్నఁడు స్వేచ్ఛ నొసంగ కుండి, సం
తాపము లేక యుండెడువిధంబున వర్తిలఁ జేసి నన్ను నీ
దాపునఁ జేర్చుకొంగదె సదా శరణాగత. ౪౯.

ఉ. నిర్మలచిత్తవృత్తి నిను నిచ్చలు నమ్మి భజించు చెప్పుడున్
ధర్మపథంబు దప్పక యథావిధి సత్క్రియ లాచరించి దు
ష్కర్మము లెల్లఁ ద్రుంచుటయె గా పరమార్గము మాఱుగొంట దు
ష్కర్మవిదూర! దేవ! యనఘా! శరణాగత. ౫౦.

ఉ. ఆపద కల్గనీ యితరు లందఱు నన్నొకవేళ దూరనీ
చూపఱ కింపుసొంపులను జూపెడువిత్తము లేక పోవనీ
యోపికతోడ లెక్కఁ గొనకుండెద వీని నొకింత యేని హృ
త్తాపము లేక యుండిన సదా శరణాగత. ౫౧.

ఉ. ఉర్వర భోగభాగ్యముల నొంది సుఖించుట కాస చేసి యీ
సర్వము నాది నే నెపుడు శాశ్వత మంచుఁ దలంచి లోన దు
ర్గర్వము నొంది మూఢత సుఖం బన నెట్టిదొ కాన నైతి నో
సర్వసమాన పుణ్యపురుషా శరణాగత. ౫౨.

ఉ. ఎప్పుడొ యేక్షణంబుననొ యీ మెయి వీడి మదాత్మ యేగు; నీ
తప్పువుబొందిలో నెపుడుఁ దా నివసించునె భ్రాంతి కాక ని
న్నెప్పుడు నమ్మి కొల్తు వను నేమర కుండుమి తోడునీడ వై
యొప్పులకుప్ప దోషహర యోశరణాగత.

ఉ. నీతియె కంఠహారము వినిర్మలభక్తి శిరంబునందు సం
ప్రీతిని దాల్పుభూషణము ప్రేమయు సత్కరణాను లెప్పుడున్
జేతులకంకణంబులు సుశీలురి కియ్యవియే సుభూషలై
పూతయశఃప్రకాశ మిడుఁ బో శరణాగత. ౫౪.

ఉ. హా! యవివేక మేఘము హృదంతరమందునఁ గ్రమ్మె దీని నీ
పాయని శ్రేమమారుతమె పాఱఁగఁ జిమ్ముచు జ్ఞానసూర్యునిన్
వేయువిధంబులన్ హృదిని వెల్గఁగఁ జేయు నటంచు నమ్మినా
నోయమలాత్మ ప్రోవవె యహో శరణాగత. ౫౫.

ఉ. నీమహిమంబు లెన్నియొ వినిర్మలరూపుఁడు సచ్చిదాత్మకుం
డీమహిమ నేలు నంచు వచియించుచు నుండఁగఁ గొంద ఱుర్విలో
సామి యొకండు లేఁ డనుట చంద్రుఁడు లేకయె సాంద్రచంద్రికా
స్తోమము గల్గు నం చనుట సూ శరణాగత. ౫౬.

ఉ. ఎన్నిదినంబులో చదివి యెన్నికుయుక్తులొ పన్ను నాస్తికుల్
సన్నుతపాత్ర నీమహిమఁ జాటున నుంచఁగఁ జాల రెప్పుడున్
దిన్నఁగ వెల్గుదీపమ్మును ద్రిప్పి యధోగతి చేయఁ దచ్ఛిఖల్
క్రన్ననఁ బైకి లేచెడును గా శరణాగత. ౫౭.

ఉ. కాయము తాను జీవమును గలిగినయప్పుడె పూజనీయమై
యాయవికారరూప మగు నాత్మ తొలంగినఁ గట్టెఁ బోలు న
ట్లే యరయంగ నాత్మకును నెంతయు నాత్మను బోలునట్టిని
న్నే యెడఁబాయు నాత్మ శవమే శరణాగత. ౫౮.

ఉ. అగ్గినిఁ జేరి నిల్చినపు డందఱకుం జలి తీఱునట్లు నిన్
దగ్గఱఁ జేరువారలును దప్పక పాపభయంబుఁ బాసి యే



యొగ్గును బొంద కొక్కట నహీనత నావల కున్నపాపముల్
తగ్గఁగఁ జేసికొందురు గదా శరణాగత. ౫౯

ఉ. పాపి పురందరుండు తనభార్యసుశీలతఁ గాంచి వేగ సం
తాపము లెల్లఁ బాయ ననుతాపము నొంది పవిత్రుఁ డయ్యె నీ
పాపల కెల్లపాపములఁ బాపుకొనం గలశక్తి నిచ్చి హృ
త్తాపహరుండ వైతివి కదా శరణాగత. ౬౦.

ఉ. పిల్లలు తండ్రి దౌసుగుణబృందముఁ దప్పక యభ్యసించి యే
కల్ల లెఱుంగకున్నపుడు కాదె సుకీర్తి గడింతు రట్టులే
చల్లనితండ్రి నీసుగుణజాతము నెప్పుడు నభ్యసించువా
రెల్లరుఁ బుణ్యమూర్తులు గదే శరణాగత. ౬౧.

ఉ. దేహము రక్తమాంసముల తెప్ప యటంచును దాని రోసి షే
సాహసచక్రవర్తులనఁ జాలుమహాత్ములు కొంద ఱుర్విలో
నూహలు చేసి కారడవు లొక్కట దూఱుచు నీమహత్త్వ మో
హోహహొ గ్రహింపఁగాఁ జని రహో శరణాగత. ౬౨.

ఉ. మానవమాత్రుఁ డైనయొకమాన్యుఁడె కా ఖగ మట్లు మింటిపైఁ
బో నుపయుక్తసాధనము బుద్ధిబలంబునఁ జేసి దానిచే
జ్ఞానము వృద్ధి చేసికొని శాశ్వతకీర్తిని బొంద నీకృపన్
బూని నుతింప శక్యమె ప్రభూ శరణాగత. ౬౩.

ఉ. ముద్దులు గుల్కువస్తువుల మోదముతోడుతఁ బిల్లవాండ్రకున్
దద్దయు నిచ్చి యాడెడువిధం బెఱుఁగించుచ. పెద్ద లాట లే
ప్రొద్దును జూచుచుండుగతి భూమిని నన్నిట స్వేచ్ఛ నిచ్చి మా
ముద్దులు చూచుచుందువు ప్రభూ శరణాగతసాధురక్షకా. ౬౪.

ఉ. ఒక్కొకయింద్రియంబునకు నొక్కొకవస్తువు విందు చేయున
ట్లక్కజ మౌపదార్థముల నన్నిటి సృష్టి నమర్చి తీవు నీ
మక్కువ యేమి చెప్పుదును మాన్యచరిత్ర నినుం దలంప నా
కెక్కుడు సంతసం బగుఁ గదే శరణాగత. ౬౫.

ఉ. ఎన్నఁడొ నీతిమార్గమున నేగుద మంచు నసడ్డ చేయుచున్
నిన్నుఁ దలంపకుందు రవినీతులు కొందఱు భూమిలోపలన్
గన్నను గాలు మూలఁ బడి కాయము వ్యాధులఁ జిక్కి యుండఁగా
నిన్ను నెఱుంగ శక్య మగునే శరణాగత. ౬౬.

ఉ. చాల విచిత్రమయ్యెడిని స్వప్నపుఁజర్యలు చూడ నంతలో
వేలకొలంది కార్యములు వేడుకలుం బొడకట్టి మాయ మా
నేల భ్రమింతు రీజగము నిట్టిద పొంగకుఁ డంచుఁ దెల్ప నీ
లీలలు పన్నియుందువు బళీ శరణాగత. ౧౭.

ఉ. దాపున లేకయే రవిసుధాకరబింబసుతారకావళుల్
ప్రాపయి నిల్పి మాకు బహుభంగుల నార్పఁగ రానిదివ్వెలై
చూపుచు సర్వము న్నతివిశుద్ధచరిత్ర భవద్గుణాళిఁ దా
మేపు దలిర్పఁ జాటెడుఁ గదే శరణాగత. ౧౮.

ఉ. తండ్రి భవత్కుమారిని ముదంబునఁ బ్రోవక యూరకున్న నా
నిండినచింత లెల్ల నిఁక నెమ్మిని బాపెడువారు లేరు నిన్
దండిగ నమ్మియుంటి మది దాసహృదబ్జనివాస నన్ను నీ
యండను జేర్చికోఁ గదె దయన్ శరణాగత. ౧౯.

ఉ. ప్రేమకు నాటపట్టు లగుపెద్దలు పిన్నలమేలు కోరియే
కోమలదేహు లైనతమకుఱ్ఱల శిక్ష యొనర్చునట్లఘ
స్తోమముఁ బాప నొక్కతఱి దుఃఖము పెట్టుచు మమ్ముఁ బిమ్మటన్
గామిత మిచ్చి ప్రోతు వనఘా శరణాగత. ౨౦.

ఉ. అయ్యయొ మందబుద్ధి నిటు లంటిని దుఃఖ మొనర్తు వంచు నో
యయ్య దయామయా యెపుడు నాసఁగ రా దిటు లీవు మోపమే
యెయ్యెడఁ గూర్చుచుందువు గదే భవదాజ్ఞల మీఱువారికే
యియ్యల బాధ గల్గును జుమీ శరణాగత. ౨౧.

ఉ. నేను సుఖంబు నొందవలె నిచ్చలు నంచుఁ దలంచి యన్యు లే
శమైనను జింత నొందనని యాత్మఁ దలంప కహీనవృత్తితో
దీనుల నాదరించుచు సుధీవరులన్ నుతియించునట్లు సు
జ్ఞానము నా కొసంగవె వెసన్ శరణాగత. ౨౨.

ఉ నిన్ను భజించువేళలను నిశ్చలచిత్తము గల్గునట్టు లో
యన్న యనుగ్రహింపఁ గదె యైహికవృత్తులు నన్నుఁ బట్టి తా
మెన్నివిధాలనో కలఁతయే కలిగించెడునప్డు వాని నా
సన్నిధినుండి పాపుము వెసన్ శరణాగత. ౨౩.

ఉ. మానవు లెల్లఁ గూడి నను మన్నన చేసినఁ జేయకుండినన్
నే నిల సత్యమంచు మది నెమ్మిని నమ్మినకార్య మెప్పుడున్



బూనికఁ జేయఁ గల్గెడుసుబుద్ధి నొసంగవె దేవ నిన్ను నే
ధ్యానము చేయుచుందును సదా శరణాగత. ౨౪.

ఉ. సోదరు లైనమానవు లసూయను నన్నిటు లన్న దాని కే
వేదన నొందియుండక వివేకము గల్గువిధంబు లన్నియున్
మోదముతోడ వారలకు ముఖ్యముగా నెఱిఁగించి వారిపై
నాదర ముంచఁ జేయవె దయన్ శరణాగత. ౨౫.

ఉ. మాటికిఁ జూడ నీకెట సమానులు లేరు గదయ్య యో జగ
న్నాటకసూత్రధార నిను నమ్మి భజింపక యున్నజన్మ మిం
కేటికిఁ గాటిపా లగుటకే యని చెప్పఁగ నొప్పునయ్య యు
మ్మాటికి నిన్నె నమ్మితిఁ జుమా శరణాగత. ౨౬.

ఉ. నా కొకవేళఁ గష్టము లనంతముగాఁ గనుపట్టుచుండినన్
జేకొని ధీరవృత్తిఁ గడుశీఘ్రమె కష్టసుఖంబులందు నే
నేకసమానచిత్తము వహించి సుఖింపఁగఁ జేయవే దయన్
నీకు నమస్కరింతు నిదె నే శరణాగత. ౨౭.

ఉ. పెద్దలు తెల్పునీతులను బ్రీతిని నే శిరసావహించు చే
ప్రొద్దును సత్యమార్గమె తపోవన మంచుఁ దలంచి యందు నే
నొద్దిక సంచరించుచు గుణోత్తము నిన్ను నెఱుంగఁ జేయుమీ
యొద్దియుఁ గోర కుండెద మహిన్ శరణాగత. ౨౮.

ఉ. జీవదయాపరత్వమునఁ జెన్నలరారు నినుం భజించుచుండువా
రేవిధ మైనదుష్క్రియల నెన్నఁ డొనర్పక యేకనిష్ఠతో
నీవిమలస్వభావముల నే తలపోసి యనారతంబు నీ
సేవకులై చెలంగుదురు శ్రీశరణాగత. ౨౯.

ఉ. నిక్కపుమార్గమందె తగ నిచ్చలు నీవు చరింపు మంచు నీ
వక్కఱతోడ నాహృదయమందు లిఖించినయక్షరంబులన్
జక్కని జ్ఞానతేజమను సాంద్రపువెల్గునఁ జూచి యిప్డు నీ
మక్కువ నే నెఱింగితిఁ జుమా శరణాగత. ౩౦.

ఉ. మానవు లెల్ల సోదరసమాను లటంచు నెఱుంగుఁ డంచు సు
జ్ఞానులు పల్కువాక్యములసారము నే రుచిఁ జూచి కొంత నా
మానసమందుఁ దృప్తిఁ గొని మానక నీ వెఱిఁగించు ధర్మముల్
పూనికఁ జేయ నెంచితిఁ బ్రభూ శరణాగత. ౩౧.

ఉ. సత్యమె నీస్వరూప మని సాధులు పల్కెడునీతివాక్యముల్
నిత్యము నామనంబునను నిక్కమటంచును నమ్మి పూన్కి నే
సత్యము నుద్ధరింపఁ గలచక్కనిబుద్ధి నొసంగి వేగ నా
కృత్యము నాకుఁ దెల్పఁ గదవే శరణాగత. ౨౨.

ఉ. ధర్మమె ప్రాణబంధు వని తప్పక నామదిలోన నమ్మి స
త్కర్మము లాచరింపక సుఖంబుగ సద్గతి నొందుమార్గమే
నిర్మలవృత్తి నారయుచు నిన్నుఁ గనుంగొనఁ జేయు మంచు నేఁ
గూర్మిని వేఁడుచుంటి నిదిగో శరణాగత. ౨౩.

ఉ. ఓవిమలాంతరంగ సుగుణోత్తమ దేవ మహానుభావ నా
భావనసీమ నీతి యనుపాదప మెంతయు సొంపు మీఱఁగాఁ
దా విలసిల్లి సత్ఫలముఁ దప్పక నియ్య నొనర్పు మయ్య యో
పావనరూప వేగమె కృపన్ శరణాగత. ౨౪.

ఉ. నే నెట నున్న నావెనుక నే చనుదెంచి భయంబుఁ బాపి స
న్మానము నొందుమార్గమును మన్ననతో నెఱిఁగించునట్టిసు
జ్ఞానపుదివ్వె నా కిడుము సజ్జనవంద్య మఱొక్కవాంఛ నా
మానసమందుఁ గల్గదు సుమా శరణాగత. ౨౫.

ఉ. ఒక్కటనంగ నేల సుగుణోత్తమ నిన్ను నెఱుంగుమార్గమున్
గ్రక్కునఁ జూపుమం బరసుఖంబుల కాసపడంగఁ జేసి నిన్
దిక్కని నమ్మియుండఁ గలదివ్యగుణంబుల నిచ్చి నన్ను నీ
ప్రక్కను జేర్చికోఁ గదె కృపన్ శరణాగత. ౨౬.

ఉ. బాములు వచ్చి చుట్టుకొని బాధల నొందఁగఁ జేయువేళ నో
స్వామి దయామయా నను వెసన్ గృపఁ జూడఁ గదయ్య యంచు నే
నీమముతోడ వేఁడుకొన నిక్కపుఁజుట్టమవై కడంక నా
బాములఁ బాపుచుండుము కృపన్ శరణాగత. ౨౭.

ఉ. కానఁగ లేరు దుర్జనులఖండకృపానిధి నీమతంబు సు
జ్ఞానము లేమిచే నకట సజ్జను లెల్లరు నిన్ను నమ్మి లోఁ
బూనికఁ గార్యము ల్సలిపి పూర్తిగ సత్ఫల మొందుచు న్నినున్
గానఁగ నేర్తు రెప్పు డనఘా శరణాగత. ౨౮.

ఉ. అయ్య దయాంబురాశివి గదయ్య ననుం గృపఁ జూడ వేగ రా
వయ్య నినుం దలంపఁగను హాయి జనించుఁ గదయ్య లోన నే



నెయ్యెడ సత్యదీక్షను వహించి చరింపఁగఁ జేయు మయ్య నా
కియ్యెల నీవ దిక్కు గదవే శరణాగత. ౨౯.

ఉ. నీదయచేత నే సుమి వినిర్మలరూప భవత్పదాబ్జముల్
మోదముతోడఁ గొల్త మనుబుద్ధి జనించెఁ దిరంబుగాఁగ నా
వేదన లెల్లఁ బాపఁగలవేలుప వంచును నమ్మి యుంటచేఁ
గాదె భయంబు తీఱె ననఘా శరణాగత. ౩౦.

ఉ. ఇంతకుఁ బూర్వ మెట్లు చరియించినఁ గాని మహాత్మ యిప్పు డీ
వంతట నిండి భక్తవరు లార్తిని బొందుట చూచి వారి కే
వంతయుఁ గల్గ నీయ వనువార్త నెఱింగితిఁ గాన నేను ర
వ్వంతయు జంక కుందు ననఘా శరణాగత. ౩౧.

ఉ. పాప మటన్న భీతి నినుఁ బాయనిభక్తి భజించువారికిన్
స్థాపితమై వసింపక విషాదము వేగఁ దొలఁగుచుండు నో
హో పరమేశ యెంతటిదయో నీ కిటు భక్తరక్షణం
బే పని యై చెలంగెడుఁ గదే శరణాగత. ౩౨.

ఉ. ఎంతయొ హాయి కల్గెడు మహేశ నినుం దలపోయువేళ నే
చింతలు నుద్భవింపక ; శశిం గనుఁగొన్న చకోరమట్లు నా
స్వాంతము నిండుమోదమున సామ్యము లేనిసుఖంబు నొందు ; ని
న్నెంతని సన్నుతింతును మహిన్ శరణాగత. ౩౩.

ఉ. నీయకళంకవర్తనము నీకె తగున్ మఱి యేరి కబ్బు నో
హో యమలాత్మ నీమహిమ లుర్విఁ గనుంగొన నామనంబులోఁ
బాయనిభక్తి గల్గి నిరపాయకరం బయి వెల్గునట్టియా
ప్యాయన మబ్బు నెంతయు నహో శరణాగత. ౩౪.

ఉ. నే నొకవేళ సత్క్రియల నే యొనరింపఁగఁ గల్గినప్పుడున్
మానసమందు గర్వ మణుమాత్రము నొందక యుండి నమ్రతన్
బూని సమస్తమందు దయపూరితబుద్ధిని గాంచునట్టిసు
జ్ఞానము నా కొసంగవె వెసన్ శరణాగత. ౩౫.

ఉ. మానవజన్మ మెత్తి పలుమాఱు నినుం దలపోయ కున్న నా
జ్ఞాన మొకింత యేనియును సార్థకతం గనఁ జాల దిమ్మహిన్
గాన ననారతం బిహసుఖంబుల నే మదిఁ గోరకుండుసు
జ్ఞానము నా కొసంగవె వెసన్ శరణాగత. ౩౬.

ఉ. మంచితనంబుగల్గి యసమానయశంబు గడింపఁ జూచువా
రంచితవృత్తి వెల్గెడుమహాత్ముఁడ ని న్నొకయూఁత కోలగా
నెంచి చరింప కున్నఁ దమ రెన్నఁడు వృద్ధిని బొంద రంచు నే
నెంచెద నయ్య యెప్పుడు మహీశ శరణాగత. ౯౭.

ఉ. ఏవిధ మైనకష్టముల కెన్నఁడు నేను జలింపకుండి నా
భావము శుద్ధి చేసికొని పావనునై వెలుఁగొంది వేగ నీ
సేవ యొనర్చి పాపము నశింపఁగఁ జేయుదుఁ గాక యోజగ
త్పావన! దేవ! భక్తవరదా! శరణాగత. ౯౮.

ఉ. నాపతి, బాంధవుల్, మఱియు నాచెలు లెల్లరు, నిర్మలాత్ములై
నీపయి భక్తి గల్గి నిను నిండుమనంబునఁ గొల్చుచుండి యే
పాపము నొందకుండునటు పాయనిప్రీతి ననుగ్రహింపుమీ
పాపవిదూర! నిస్తులకృపేశ శరణాగత. ౯౯.

ఉ. ఓయవికారరూప నిను నొక్కని మాత్రమె నమ్మి, యుర్విలో
నేయవి నమ్మి కొల్వక, యహీనత మానుషకృత్యముల్ సదా
ధీయుతలై యొనర్చుచు, సతీమణు లెల్లరుఁ బూరుషాళి కా
ప్యాయ మొసంగఁ జేయవె దయేశ శరణాగత సాధురక్షకా. ౧౦౦.

సమాప్తము.



